# రామాయణ కల్పవృక్షము : విరాధవధ

శ్రీ కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి

శ్రీమద్రామాయణమున ప్రసక్తములైన చిన్న కథలలో విరాధుని దొకటి. రాముడు వీనిని చంపినాడు. చంపలేదు. చచ్చునట్లుగా చేసినాడు. ఆ చేయుటయు విరాధునిమాట చొప్పున. ఇది చిత్రముగానున్నది. అనగా విరాధుడు తనను చంపుమార్గ మిది యని రామునితో చెప్పినాడన్న మాట. ఇట్లనుటవలన విరాధుడు చావును కోరి దానికై నిరీక్షించుచున్నాడన్న మాట. ఈ విరాధుని శీలలక్షణమే చమత్కారముగా నున్నది. వాల్మీకి వ్రాసినాడు. "స్వర్గం విరాధేన హి మృత్యు రాత్మనః ప్రసహ్య రామేణ యథార్థ మీప్సితః నివేదితః కాననచారిణా స్వయం న మే వధః శస్త్రకృతో భవేదితి" రామాయణమును తెనుగున చాలమంది వ్రాసిరి. ఈ కథ వ్రాయుట కేమి? ఎవరైనను వ్రాయవచ్చును. కథాగత శీలలక్షణమును గుర్తించి వ్రాయుట నిశిత పరిశీలనాదక్షము, ధీశక్తిముగలవాడు చేయగలిగినది. విరాధవధ నిర్వహణమున కేవలమొక్క విరాధుని శీలలక్షణము ప్రస్ఫుటమైన తీర్పున్ని వేశము పూర్ణాకృతినందినట్లగాను. రాముడు,లక్ష్మణుడు,సీత వీరు ముగ్గురును విరాధవధనముతో సంబంధముకలవారు. వారివారి శీలలక్షణములను అచట సముచితముగా చూపబడవలయును. భాస్కర రామాయణమున నీ ఘట్టము ఇరువది నాలు గద్యపద్యములలో ముగిసినది. భాస్కరునకు కథాగతములైనట్టి పాత్రముల శీలలక్షణములను స్పష్టముగా దర్శించుశక్తి లేదు. వాల్మీకి రాముడు విరాధుని చంపినట్లుగా వ్రాసినాడు గనుక భాస్కరుడును వ్రాసెను. అసలు రామాయణము వాల్మీకి హృదయము దర్శించి అది ఫలానా అన్న నిష్కర్షతో వ్రాసినవాడుకాదు భాస్కరుడు.

వాల్మీకి రామాయణమునకు భావ్యముగా వచ్చిన శ్రీమద్రామాయణ కల్పవృక్షమున పూర్వరామాయణములలో లేని వైశిష్ట్యమొకడెడతెగక స్ఫుటముగా నున్నది. ఈ విరాధవధ ఈ కల్పవృక్షమున యాభైయారు గద్యపద్యములలో నిర్వహింపబడినది. దీనికి ముందు ఎనిమిది గద్య పద్యములతో పూర్వరంగము నిర్మింపబడినది. ఈ పూర్వ రంగ కల్పన కేవలము విశ్వనాథోపజ్ఞము. ఏ తత్రంగమట్లుగా నగుటకు హేతువు రాముని శీలలక్షణములోని వైచిత్రి. రాముని శీలలక్షణము స్వరూపమేమి? ఏతత్స్వరూపము సర్వమును ఇట పరిశీలింపక ప్రధానాంశములను చెప్పెదను. అందు హాస్యశీలత మొదటిది. ఋషులన్న మైత్రిని తలపు రెండవది. అన్నింటికిని మూలమైనది సర్వాత్మ్య వివేకముతోడి ఆత్మజ్ఞత్వము. ఈ యీ గుణములు రామునియందీ కల్పవృక్షమున తిరతిర నిక్షిప్తములు. బాలకాండమున శ్రీరామ సోదరుల విద్యాభ్యాసంగములో పూర్తియగు అవతార ఖండాంతమునకు రాముడు హాస్యాద్భుత శీలి యని కవి తొలుగా నిష్కర్ష చేసెను. అయోధ్యా కాండ ప్రధాన ఖండమున యమునానదిని దాటిన తరువాత శ్రీరాముని విగరబడి నవ్వుటను చూచి సీతాలక్ష్మణులు "ప్రకృతితో నొకడై పసివానివోలె కన్పడు, కుహనా మనుష్యకృత నాగరబంధము లూడ్చినట్లుగ" అని అనుకొనినట్లుగా చెప్పి రాముని హాస్యశీలత అరణ్యమునకు వచ్చినతరువాత మరియు నధికమైనట్లుగా చూపించినాడు కల్పవృక్షకర్త. తరువాతి అరణ్యకాండమున మారీచునిచే రామునిలోనున్న లోపమా హాస్యశీలతయే అనిపించును—ఈ రాముని హాస్యశీలమును విశ్వనాథ ఇంతగా అద్భుతద్భుతస్పష్టము చేసినాడని చెప్పుట యేలయనగా రాముని శీలలక్షణ సంబంధి హాస్యమే ఈ విరాధవధకు పూర్వరంగమును సముచితముగా నిర్మించినదని చెప్పుటకు. అనగా విశ్వనాథ రాముని ఆ శీలలక్షణము నచట పైకి తెచ్చినాడన్న మాట.

అసలు విరాధవధకు మొదటిది వాడు సీతను పట్టుకొనుట. అడవిలో సాధారణముగా లక్ష్మణుడు ముందు నడచును. వెనుకగా రాముడు. సీత మధ్యలోనుండి నడచును. ముగ్గురును దాదాపు వెంటవెంటగా నడతురు. రామలక్ష్మణు లంత దగరగా నున్నపుడు విరాధుడు సీతను పట్టుకొనుటకు వీలులేదు. వీలులేదనగా వీలు

లేదనికాదు గాని, వాడు సీతమీదికి వచ్చునప్పుడు వారేమిచేయుచుండిరను ప్రశ్న వచ్చును. రంగనాథుడు వ్రాసినాడు. గరుడుడు బాలనాగమును బలిమి నొడిసి మింటికెగసినట్లుగా విరాధుడు సీత నెత్తికొని మింటికెగసినాడని—అది వేరు విషయము. భాస్కరుడీ మాత్రపు టూహయును చేయలేదు. "గదిసి జానకిఁబట్టి శీఘ్రముగ జంకెఁదాల్చి"నా డనినాడు. ఈ కల్పవృక్షమున సీతను విరాధుడు పట్టుకొను సమయమునకు రామలక్ష్మణు లిరువురును సీతకు కొంత దూరముగా పోయిరి. ఊరక సీతను దూరముగా వదలి వారు పోరు. ఆ వారి పోవుట చమత్కారముగా కల్పింపబడినది. రాముని జీవలక్షణ మాధారముగా కల్పింపబడినది. దండకారణ్యమున వారు ముగ్గురును పోవుచున్నారు. దూరముగా సమీపమున చెఱువు వేదో ఉన్నట్లు తోచినది. సీత నడువలేక కొంతసేపు సేద తీర్చుకొనవలయు నను కొన్నది. అనుకొన్న తరువాత—

"చెఱువు నొద్దున విశ్రమించెదము కాద
యనిన జానకి శ్రీరాముడనె అయోధ్య
వదలి విశ్రాంతికొరకయి వచ్చినావె
అనిన జానకి యటఁగలదా యటందు"

"అవున అయోధ్యలోఁ దెలిసి
యుంతని యుంతని చెప్పనా ? ధరా
ధవుకు సున్నమైక జీవదనై
దైవతలోకము లిద్దరైన రా
ఘవుని వశంబుపోక కథకటె
నిరంతము ప్రసుక్కతలి. అ
న్న వదలినటి చెప్పలయినన్
బిత్తమ్ముడు కొల్వ దప్పరిన్."

ఇది సీతారాములసంభాషణము. 'చెఱువు నొద్దున విశ్రమించెదము కాదా' యనిన జానకి మాటలోని యర్థ మదట కొంచెముసేపు సేద తీర్చుకొనవలయును. నే నలసిపోయినాను అని. అయోధ్యవదలి విశ్రాంతికొరకయి వచ్చినావె యని రాముడనుట చమత్కారగర్భము. చిన్న దెప్పిపొడుపు. అది యట్టిదని ఎప్పుడు తెలియునన గా అయోధ్యాకాండమున రాముడు సీతను నీవరణ్యము రావద్దనుట—ఆమె వచ్చెదననుటగా జరిగిన అచటి సంభాషణము స్మృతిలో నున్నపుడు. "వైదేహియున్ నీ వెంటంబడిరాక నీకు బరువా ?" "వనంబులకు నేన్ నీ వెంట నే వచ్చెదన్" అన్నది సీత.

"నీ వరుజేగు మార్గమున నీ పదునొకనకు (నాకు) బాధ తప్పదు" అనినాడు రాముడు. "విన్నవ్వాడి దను నాకు నెవ్వగయని కలిగినంగద. బానయేఁ గలుగు నీకు" అన్నది సీత. అప్పుడా అనుట నిజమే. నీతో నున్నచో నాకు బాధేమి. అదే సుఖము అని అప్పుడన్న సీతమాటలోని పరమార్థము వేరు. తీరా అడవిలో నడచుట ప్రారంభముకాగా సీతకు కొంచెము శ్రమ అనిపించినది. అందు కన్నది చెఱువునొద్దున విశ్రమించెదము కాద అని. హాస్యశీలుడు రాముడు దానిని సాగదీసి చమత్కరించినాడు. ఆ చమత్కారమును సీత మరొక వైపుగా త్రిప్పినది. "అవును అయోధ్యలో తెలిసియుంతని యుంతని చెప్పనా... అన్న వదలినటి చెప్పలయినన్ పిన్నతమ్ముడు కొల్వ దప్పరిన్" సీత ఇట్లుగా త్రిప్పుట నిజమునకు ధరణిపై తనకట్టి యుత్ప్రాణ ముండికాదు. ఊరక రాముడు మాటకు మాటగా నేదో మాటాడవలయునని మాత్రమే. సీత ఆంతర్యము రామునకు తెలియదా ? బాగుగా తెలియును. కాని తదాంతర్యమును గుర్తెరిగినవానివలె పైయుద్ధమునకు కోపము వచ్చిన వానివలె నట్యును. అందువలన రాముడు మాటాడలేదు. నడచుచుండెను. సీతకు రాముడు మాట్లాడుట కావలయును. రామునకు కోపము వచ్చినట్లుగానున్నది. తానే కల్పించుకొని మాటాడవలయును.

"వనము మరల తీగను త్రో
క్కన జాడగఁగానిపించుఁ గేవల మిది త్రో
వవిలు లేదు చేయివను
కొనివది కన్పింప దడవిక్రోవలయు కాకన్"

"ఆ రాముండనె నెంతయున్ మరల
కొన్నంగాదటే ఘోరకాం
తారంబుగా పతితో డ వచ్చు
టనినన్ దాత్రిజ సర్వంబులు
ద్రొక్కి రాసైనది ధర్మపె మరల లేదన్నగా
రఘూత్తంసకుం
డారంభించు శిరః ప్రకంపముగ
ముందై యేగ మార్గంబునన్"

ఎంతసేపటి! చెఱువురాదేమి? మనము మార్గము తప్పలేదుగదా? ఈయడవిలో నెంతసేపని యిట్లు నడచుట?—ఇది సీత తాత్పర్యము. దానికేదో రాముడు సమాధానము చెప్పవలయును. చెప్పవనియే—చెప్పక

లయుండనిచే సీత అట్లనినది. రాముడు బదులు మాటాడి నాడు. ఆ మాటాడుటలో నున్నది చమత్కారము. సీత మాయాలుగా నన్నది నునను మగులు తీసను. ప్రోక్కి నటాడగా గనిపించుచున్నదని. హాస్యాద్భుతశీలి రాముడు ఆ సీతయన్నదాని లోని మగులు శబ్దమును విడిగా గ్రహించి తదర్థమును పైకిలాగి దానిని జానకిమీదికి విసరినాడు. ఆమె అంతకుముందు అయోధ్యలో మాత్రము విశ్రాంతి యున్నదా అన్నట్టుగా ధర్మంపు బుద్ధ్య రాజైనది. ధరిత్రిపై మగులు లేదన్నది. ఆమె ఈ మాటను చమత్కారగర్భముగా గడుసరిమాటగా అన్నది. రాముడా చమత్కారమును గ్రహింపనివాడువలె లోమునుడి విస్ఫుట కోపాభిమాన హృదయుడైల్లగా, ఆరంభించు తరః ప్రకంపముగా సీతను వెనుకగాచేసి ముందుగా నడచినాడు. శ్రమమున కించిద్దుఃఖాభిమాన హృదయ జానకి వెనుకై సాగినడచినది—వారు తటాకము తీరము చేరుకొన్నారు. లక్ష్మణుడు కంటకాకృతిమైన తటి మున సౌభాగ్యపవాస్థానము చేసినాడు. కాని రాముడు ఇంకకొంచెము దూరముగా పోయి నిలబడి నాడు. సీత అట్లే వెనుకగా నిలబడినది. లక్ష్మణుని కమియు తోడక తను తటాకములోనికి దిగినాడు. రాముడు దూరముగా సీతవైపు చూచుచు నిలబడి లేదు. విముఖుడై నిలబడెను. వెనుదిరిగి తనను పిలచు నేమోయని సీత అట్లే నిలబడినది. విముఖుడైన రాముడు నెమ్మదిగా అడుగులు ముందుకు వేయుచుండెను. ఈ సమయమున విరాధుడు సీతను పట్టుకొనెను. రాముడు సీతవైపు చూచుటలేదని ముందుకడుగులు వేయుచున్నాడని, ఎట్లు తెలియ వచ్చినదనగా—విరాధుని వికటాట్టహాసమునకు "విముఖుండైన వ్యామి జానకిదెసన్ వీక్షించ"వన్న పద్యము వలన—విరాధుడు సీతను పట్టుకొనుటకైన పూర్వరంగమును రాముని హాస్యశీలము నాధారము చేసి సీత నుండి రాముని దూరము చేయుటలో ఈ వ్యాసమున మొదట వేయబడిన ప్రశ్నకు సమాధానము లే: పోవుటతో పాటు మరొక రహస్యమున్నది. రాముడు చెంతలేనపుడే సీతకు కష్టము వచ్చును గాని దగరగా నున్నపుడు రాదు. రావణుడు సీత నపహరించినది రాముడు లేడివెంటబడి దూరముగా పోయిన తరువాత. కాకాసురుడు సీతను వేధించినదియు రాముడు సమీపమున నున్నను నిద్రించుచున్నపుడు. జాగృతుడు దూరమున నున్నను నిద్రించుచు ప్రక్కనున్నను ఫలిత మొకటియే. మరియును ఈ మాసింటికుండు నొక విశేష మున్నది. లేడివెంటబడి రాముడు దూరముగా పోవుటకు సీతయే హేతువు. కాకము చెంతగా పిలిపించుటకును 'తొంటిట్టుల దూగిదన్ బతికి నిద్రాభంగమా' నని ఓర్చుకొన్న సీతయే హేతువు. ఇపుడు విరాధుడు పట్టుకొనుటకు వీలుగా రాముడు దూరము పోవుటకును మాటకు మాటగా చమత్కరించిన సీతయే హేతువు—కల్పవృక్షమునందలి విరాధకథకైన పూర్వరంగ మింతగా భావగంభీరము. సన్నివేశ మత్యంతము సహజముగా దాంపత్యము అది అట్లుగా వివరించుట రాముని లీల లక్షణసంబంధి హాస్యశీలత—సీతాపాతురహస్యము—పరస్పర ముత్కర్షాపాదకములుగా పూర్వరంగము నిర్వహింపబడినది. వ్యంగ్యసర్వస్వ భారతియైన మహాకవి కావ్యనిర్మాణ శిల్ప మట్టిండును.

ఇదట నింకొక విశేషము చెప్పవలయును. రాముడు దగ్గరగా నున్నపుడు విరాధుడు సీతను పట్టుకొన్నతో రాముడూరకుండునా అన్న ప్రశ్న వచ్చునని రాముడుదూరముగానున్నటు కల్పింపబడినట్లు చెప్పినావు గదా!—వెనుదిరిగి సీతను పట్టుకొన్న విరాధునిమాచి కూడ రాముడువెంటనే వానిమీదకు రాక లక్ష్మణునితో ఏమేమో అనుచూ కావ్యపరాఙ్ముఖుడైనట్లు వ్రాయుట కారణమ్మదా? అను సందేహము కొందరకు రావచ్చును. "తరణికులులు నిలిచి చూచుచుండ వివ్వరహం దరి సీత పొంగుచున్న చేటునరసి" అని వ్రాయబడినది. అనగా దానియర్థమిది. వారరణ్యము ప్రవేశించిన తరువాత కనిపించిన మొదటి రాక్షసుడు విరాధుడు. వాని ఘోరాకారము వాని వేషము—వాని హుంకారము రామలక్ష్మణులను భయము గొల్పునట్లుగా నున్నవి. కోట కొండలను చిన్నతనమున చూచిలేదా! సంహరింప లేదా! అని యనవచ్చును. ఇప్పుడు సీతచేటు పొందు చున్నది. అయినను వేరేపనిగా రక్షించుటకు వెంటదూకుటయు, ఒడ్డున కాలు నిలవద్రొక్కుకొన లేక గాపుకేకలు పెట్టుచు విస్ఫుటయు రెండును లోకమున నున్నవి. పైగా విరాధుని సీతపట్టుకొనుట హాహాత్సంభవము దానివలన నిశ్చేష్టత. వెంటనే విరాధుని మీద పడవలయునన్న ఊహారానీయ నిశ్చేష్టత ఇంకను విరాధు వదలనుండినాక ఆమెనట్లే పట్టుకొని వారితో మాటలకు దిగినాడు. ఆ మాటలలో వాడు కొంచెము పరిశీల్యభావుడుగా నున్నాడు. పాదములమీద వాని

విరాధుడసలైన గంధర్వత్వ భావము కలిగి పైశాచిక దేహముతోడి ప్రవృత్తి నెరపుట విశ్వనాథ బహుచమత్కారముగా నిరూపించినారు. లక్ష్మణుడు క్రుద్ధుడయి రాముడు స్వవిషయము చెప్పక మునుపు విరాధుని నీ వెవ్వడవురా! అని గద్దించినపుడు "విరాధుడు అంతి వికటాట్టముగా నగి మీరలెవ్వ రెందుకును బోవుచుంటిరని తొల్తను చేసెదుంగాక మీరు చెప్పిన దుదిలేదు, నన్నడుగ చేర్చితి" అనుటకూడ విరాధుడు తన శాపావసాన మెరిగి విచారించుచుండుటను సూచించుచున్నది. రామలక్ష్మణుల మని రాముడు చెప్పినప్పటినుండియు వాడు సంతోషించుచునే యున్నాడాత్మలో. సీతను వదలి మీ దారిని మీరు పొండనుటలో విరాధుని అంతర్యమదియే. వారెల్లను సీతను వదలిపోరు. సీతకొరకే తనను చంపుదురు. తనకు కావలసినదే అది. అందువల్లనే రాముడు క్రోధములో "వసలుగా సీతవదలి నీవలను పొమ్ము" అనినపుడు—రాముని క్రోధము విరాధుని ఆత్మలో సంతోషము కలిగించుచున్నది. అయ్యాత్మలోని సంతోషము దేహధర్మమను మార్గమున వికటముగా వ్యక్తీకరింపబడుచున్నది. "అనిన విరాధుడు నవ్వి మీరు నన్ను జంపెదమంటిరి గదా? సీత వదలిన యేటికి జంపెదరు!" ఇది విరాధుని మాటలు. సీతను వదలినచో నిజమునకు వారు విరాధుని చంపరు. కాని చంపుట వానికి కావలయును. అది అవచనములోని యాంతర్యము. కావలసిన దానిని కావలసినట్లుగా స్పష్టముగా చెప్పుటకు రాక్షస దేహోద్భవము అడ్డు వచ్చును. వచ్చినది. అందువలననే ఆ విరాధుని వాక్యము మూర్ఖుని మాటగా నున్నది. రాముడని వాడు "మూర్ఖులంబు నీ పృథ్వ్యదూష్యత గుణం"బని. పాత్రోచిత లక్షణమును పట్టుకొనినపుడే అట్లుగా వ్రాయుట సంభవించును. పూర్వజన్మ సహజమైన గంధర్వత్వము స్మృతిలో నుండుకొని, తాత్కాలికమైన పైశాచిక దేహముతోడి మనుగడతో, తద్దేహమును వదలించుకొను యత్నమున జాగృతుడైన జీవి విరాధుడైన తుంబురుడు. తజ్జీవలక్షణము సుస్థింపబడి తదుద్దిష్టప్రాపకముగా సర్వరచనయు చేయబడిన దీ కల్పవృక్షమున. అసలు శ్రీమద్రామాయణమునందలి సర్వవిషయముల జీవలక్షణము భావ్యము చేయబడి శ్రీమద్రామాయణ కల్పవృక్షమైనది.

విరాధుని జీవలక్షణ మిదియని రామాయణ కల్పవృక్షమున చెప్పబడలేదు. లేదనగా లేదని గాదు. చమత్కారముగ నున్నది. ధ్వన్యర్థస్వరూపమున నున్నది. పాత్రదశలో నున్నది. విరాధునకు శాపశస్త్రశస్త్రములతో చావవని తెలియును. తాను బ్రతికియుండగానే పూడ్చిపెట్టబడవలయును. ఐనచో రాముడని తెలిసికొనగనే విరాధుడాయనకీ విషయము చెప్పవచ్చును గదా? చెప్పలేదేమి? శ్రీరాముడు "విడిక చావడు గోయి త్రవ్వు." మని లక్ష్మణునితో ననిన తరువాత "శ్రీరామా! మంచియూహ చేసితివయ్యా" అనినాడేమి? ఆత్మజ్ఞత్వమునకును దేహోద్భవమున కలిత పనమలిన వాసనలకును భేద మదటనే యున్నది. విరాధునకా తెలివి రాముడీమాట అన్న తరువాత కలిగినదా? లేక రామలక్ష్మణులమని అనుడు చెప్పగనే కలిగినదా? అప్పుడే కలిగినది గాని రాముని ఆ మాటలతో అది పైకి వచ్చినది. అనగా వాక్ స్థితికి వచ్చినది. దేహధర్మమును త్రోసి ఆత్మ ధర్మము వాక్ స్థితికి వచ్చుట కింతసేపు పట్టినదన్నమాట. విరాధుని పూడ్చిపోవుచు దారిలో రాముడనినాడు.

"తన పూర్వంబగు జన్మలో గలుగు
వృత్తాంతంబు తా నేరడుం
గను, దుష్టాదరణంబు నేపగిదిఁ
గైకొన్నాడు? నస్గాంచినం
తన పూర్వ స్మృతిగల్గినా వెదకు
చుండా వచ్చె నన్నాడుగా
నను? పైశాచిక దేహమే! బలమొ
గంధర్వత్వ భావానకున్?"

రాముడన్నట్లుగా వ్రాయబడిన ఈ పద్యమువలన సాధింపబడిన ప్రయోజనములు రెండున్నవి. విరాధుని జీవసంపుటిలోని వైలక్షణ్యమును తిర్కించి నిష్కర్షించుట ఒకటి. రామునియొక్క జీవసంబంధి విచారశైలశీలమును నిరూపించుట రెండవది. తాటకవధనాటి నుండి రాముని ఈ విచారశైలశీలము తుదిదాక సముచితముగా నిరూపింపబడిన దీ రామాయణకల్పవృక్షమున.

విరాధుని పైశాచిక దేహమునకు తగిన యుద్ధతి యనిపించు మౌర్ఖ్యము—తద్ధతిపై వాని గంధర్వత్వ భావస్మృతితోడి జీవలక్షణము—వాడు సీతను పట్టుకొనుట కనుకూలముగా కల్పింపబడిన పూర్వరంగ నిర్వహణము, నాన్యతో దర్శనీయమై పరమ రమణీయముగా ఈ రామాయణకల్పవృక్షమున నున్నవి. అనంతకోటి కావ్యశిల్పములు బహుసహస్రముఖముల ప్రదర్శింపబడిన మహాకావ్యేతిహాసములోని ఒక చిన్న విషయమును స్థూలముగా వ్రాసినాను.

# దృష్టి

శ్రీ కొలకలూరి ఇనాక్

***పాత్రలు: రమేష్‌బాబు, హేమలత, గంగాధరం, నరసమ్మ, డాక్టరు: ప్రభాతసమయం, మురళీగానము**

గంగాధరం: అమ్మా!

హేమలత: ఏం నాన్నా!

గంగా: కాఫీ ఏలావుంది?

హేమ: చాలా బాగుంది నాన్నా! కన్నతల్లి లాంటిది మన దాది.

గంగా: మీ అమ్మే వుంటే నీ కిన్ని కష్టా లుండక పోయేవి.

హేమ: అదేమిటి నాన్నా! నా కష్టమేం?

గంగా: ఏవమ్మా! అదికే వుంటే...(బాధపడి...లేదు కాని) విధి వ్రాత ఎవరు తప్పిస్తారు? నీ కళ్ళే మాతాయా! భగవంతుని కరుణ ఎలా వుందో?

హేమ: (బాధగా) డాక్టరు చెప్పారుగా నా కళ్ళు వస్తాయని. రాత్రి నువ్వూ చెప్పావు—నా కళ్లు వస్తాయని డాక్టరు చెప్పారని. మళ్ళీ ఇప్పుడు బాధ పడ్డమెందుకు నాన్నా!

నరసమ్మ: అది మీ నాన్న గారి అనుమానం గాని తప్పకుండా నీ కళ్లొస్తాయి తల్లీ!

హేమ: నిజంగానా? మా అమ్మలాగా నన్ను కళ్లలో దీపాలు పెట్టుకొని రాత్రీ పగలూ అనకుండా చూస్తున్నావు. నీ ఋణం తీర్చుకోవడం కష్టం.

నర: పిచ్చితల్లీ! పడుకో! ఎక్కువగా మాట్లాడకు.

హేమ: ఇవాళ డాక్టరుగారు నా కళ్లు విప్పుతానన్నారుగా, నీతో ఏమైనా చెప్పారా?

నర: చెప్పారమ్మా. నీ కళ్లు తప్పకుండా వస్తాయనీ, ఇవాళ కట్లు విప్పుతారు.

హేమ: వారిని నేను చూడలేదుగాని, వారి హృదయం మాత్రం చూడగలుగుతున్నాను. చాల కరుణామయులు. పెల రోజుల్నుంచి రైముకు వచ్చి శ్రద్ధ తీసుకొని మరీ, నన్ను చూస్తున్నారు.

గంగా: మంచివాడు. మొన్న మొన్ననే ప్రాక్టీసు పెట్టాడు. ఎంతో మంచి డాక్టరని అప్పుడే పలువురూ అనుకొంటున్నారు.

నర: వారున్న దాన్ని ఉన్నట్టు చెప్తారమ్మా! సూటిగా మెలిగే పద్ధతి వారిది. వారవుతుం దంటే అవుతుంది. లేదంటే లేదు. అంతే!

హేమ: అయితే నాకు చూపు తప్పకుండా వస్తుం దన్నమాట.

నర: చూపు తప్పకుండా వస్తుంది. ఎందుకమ్మా అంత భయం.

హేమ: నాన్నా! ఇవాళ చాలా ఆనందంగా వుంది.

గంగా: పెలరోజుల తరవాత...అదృష్టవంతురాలివమ్మా!

నర: కన్నకూతురు మరి. కళ్లకు వచ్చింది.

గంగా: నరసమ్మా! కాఫీ కప్పులు పట్టుకెళ్లు.

నర: సరేనండి (కప్పులు కడిగితే వచ్చేస్తాని. వెళ్లి పోయింది)

హేమ: నాన్న! మనదాది మంచిది.

గంగా: అవును గానీ......

హేమ: ఏం నాన్నా!

గంగా: రమేష్ వస్తున్నాడు.

హేమ: ......బావ......

గంగా: అవునమ్మా! నిన్న ఉదయం మద్రాసు వచ్చాడు.

---

* భారతీయ భాషలలో విశ్వ విద్యాలయం విద్యార్థులకు ఆలిండియా రేడియో (ఢిల్లీ) వారు శ్రవ్య నాటికల పోటీలు జరిపారు (57-58). "దృష్టి" ద్వితీయ బహుమతి పొందింది.

హేమ : బావదగ్గర డబ్బుందో? లేదో??

గంగా : మీ బావకు నీవు ఎన్నడైనా డబ్బు విషయంలో లోపం కలుగజేశావా? ఎక్కువే పంపావు!

హేమ : ఇక్కడికి బావ ఎప్పుడొస్తాడు నాన్నా!

గంగా : నిన్న సాయంకాలం టెలిగ్రాం ఇచ్చాడు బయలుదేరుతున్నట్టు. నిన్న జనతా కు బయలు దేరితే తొమ్మిదిన్నరకల్లా వస్తాడమ్మా!

హేమ : తొమ్మిదింటికే వస్తాడా నాన్నా!

గంగా : అవునమ్మా!

హేమ : అయితే కారు స్టేషనుకు పంపు నాన్నా.

గంగా : అలాగే చేశానమ్మా!

హేమ : నాన్నా!.........ఫారిన్ వెళుతున్నప్పుడు చూశాను బావను. మళ్లీ ఇదే చూడబోవటం. ఈ కళ్లతో ఎలా నాన్నా? డాక్టర్ని పిలవ్వా?

గంగా : సరేనమ్మా!

హేమ : నాన్నా! నాన్నా! జనతా కరెక్టు టైమేనేమో కనుక్కో!

గంగా : సరేనమ్మా! డాక్టరూ వస్తాడు. రమేష్ వస్తాడు. డాక్టరే ముందువచ్చేట్టు చూద్దాంలే— అమ్మా, ఏమిటే నీరసంగా వున్నావ్ జ్వరంగా వుందా?

హేమ : నీరసమూ, జ్వరమూ—ఏమిటి నాన్నా నువ్వనేది?

గంగా : ఏమిటోనమ్మా, నీముఖం పేలవంగా జీవకళ లేకుండావుంది.

హేమ : అదేమిటి నాన్నా! నాకివాళున్నంత ఆనందంగా ఎప్పుడూ లేదు. కాని—ఒకటే అనుమానంగావుంది—

గంగా : అనుమానమేమిటి?

హేమ : నాకళ్లొస్తాయో, రావో?

గంగా : తప్పకుండా వస్తాయి. భయపడకు. ధైర్యంగా వుండాలి మరి.

హేమ : బావ వచ్చేక వేళ.........

గంగా : బావ వచ్చేక వేళ...ఏమిటమ్మా?

హేమ : కళ్ళురాకపోతే పెళ్ళిచేసుకోడేమో?

గంగా : అమ్మా! అదానీభయం. అందుకా ముఖం అలా పెట్టుకున్నావ్. అతని హృదయమున్న సంగతి నాకంటే నీకే బాగా తెలుసు. అతను కృతఘ్నుడుకాడు. అయినా నీకు చూపు తప్పకుండా వస్తుంది. భయపడ నక్కరలేదు.

హేమ : నిజంగా నాన్నా! నిజంగానా!

సర : (ప్రవేశించి) పిచ్చితల్లి ముఖంలో ఇప్పుడు వెలుగు రేఖలు చూస్తున్నాను.

హేమ : ఏమిటి సరసమ్మా!

సర : నిజమేనమ్మా! ఇప్పుడు కళకళలాడుతున్నారు మీరు.

హేమ : నాన్నా! టైమెంత?

సర : రమేష్ ఇంకో గంటా గంటన్నరకల్లా వచ్చేస్తారులే అమ్మా!

(టెలిఫోను మోగింది)

హేమ : బావ స్టేషనుకువచ్చి ఫోను చేస్తున్నాడేమో చూడు నాన్నా

(టెలిఫోను మళ్ళీమోగింది)

గంగా: సరసమ్మా, ఫోను చూడు!

సర : సరేనండి. (వెడుతుంది)

(గోడగడియారం ఎనిమిదికొట్టింది)

గంగా: అప్పుడే వస్తుందటమ్మా (టెయిను. తప్పకుండా తొమ్మిదింటికల్లా వస్తాడమ్మా!

హేమ: నాన్నా!

గంగా: ఏమమ్మా! తప్పకుండా తొమ్మిదింటికి వస్తాడు.

సర : (వచ్చి) తప్పక వస్తారట గాని తొమ్మిదింటికి కాదట. తొమ్మిదిన్నర తరువాత. పేషెంట్లు చాలా వున్నారట, ఒక కేసు సీరియస్ గా వుందట.

గంగా: అవును మరి. డాక్టరు! అర్జంటు కేసు లుంటాయి. అయినా సరసమ్మా! మళ్ళీ ఫోను చేయి. అమ్మాయి ఎదురుచూస్తోందని చెప్పు. వీలైనంత త్వరగా రమ్మను.

హేమ: బావ వస్తాడు. చూడాలి. కట్టు విప్పాలి. తొమ్మిదిలోగా, వెంటనే రమ్మని చెప్పు!

సర : సరేనమ్మా!

హేమ : డాక్టరు వేగమే రావాలి. కట్టు విప్పాలి. బావవస్తాడు. నాకు కళ్ళొస్తాయి. బావ వస్తాడు. నాకు కళ్ళు వస్తాయి.

గంగా : అవునమ్మా!

హేమ : నాన్నా! బావ! అమెరికా వెళ్ళేటప్పుడు కన్నీటికి నోచుకున్న నాకళ్ళు...ఇవాళ...

గంగా : (బాధగా) అవునమ్మా!

హేమ : నాన్నా!

హేమ: ఆ చెట్టుక్రింద పచ్చని గరికమీద బెంచీ వుంది కదూ!

వర : అవునమ్మా! నెలరోజుల్నించి వాడుక లేకుండా వుంది.

హేమ: బావ ప్రయాణాని కొకరోజుముందు ఆ బెంచీ మీద తన ఒగిల్లో నన్ను చేర్చుకొని 'హేమా' 'నువ్వు లేకుండా నే కాలమంతా ఎలా గడప గలను...'

వర : అంతలో నేనువచ్చి భోజనానికి రమ్మంటే వచ్చారుగదూ!

హేమ: అవును. బావ వెళ్ళిపోయేరోజు, సరీగ్గా ఇదే వేళకి, నాకళ్ళల్లోకి చూస్తూ ఏమేమో చెప్పారు. నేను, 'బావా ఈ కాలమంతా ఎలా గడిపేది? ఇంతవరకూ కలిసిమెలిసివుండి చదువుకున్నాం. ఇంక ఎలాగ...'

వర : అంతలో నాన్నగారొచ్చి, 'రమేష్ ట్రెయిన్ టైం అయింది. త్వరగా తెములండి' అన్నారు గదూ!

హేమ: అవును. అప్పుడు వెంటనే విడిపోయాం. ఇవాళ బావ వస్తున్నాడు నాకళ్ళొస్తాయో! రావో!! ఏమంటాడో? ఏమో??

వర : భయపడకమ్మా! రమేష్ నిన్ను ఏ పరిస్థితుల్లోనూ కాదనడు. నీ కళ్ళు తప్పకుండా వస్తాయి.

(కారు హారను)

హేమ : అదుగో బావ వచ్చాడు.

వర : ఇంతత్వరగా బావ వస్తాడెమ్మా! మరీ ఓపిక లేకపోతే ఎలా — డాక్టరొచ్చారు!

హేమ : (సంతోషంతో) డాక్టర్! డాక్టర్!!

డాక్టరు: హల్లో... ఏమిటి కిటికీదగ్గర చేరారు — సంతోషంగా వున్నట్టున్నారు. గుడ్ అలావుండాలి. చలనిగాలి పీల్చుకుంటున్నారు — దట్ ఈజ్ బెటర్. యస్, మర్చిపోయాను. ఆరోగ్యంగా నే వుందిగదూ — ఇంతవరకు జ్వరం రాలేదుగా — అవును రాదు. రావటానికి వీలేదు. యస్ పదింటికి విప్పుతాను. కళ్ళొస్తాయి. రమ్మన్నారట. ఏరోజు విశేషం సీరియస్ కేసా కటుంది. అయినా తప్పకుండా రమ్మన్నారని వచ్చాను. ప్రత్యేకంగా విశేషముంటే చెప్పండి. హుషారుగా వున్నారు. గుడ్ అలావుండాలి.

వర : బాబూ!

డాక్టరు : పదింటికి వస్తాను. అర్జెంటుగా వెళ్ళాలి. ఏదిని కొంచెం గాలిలో తిప్పు. వస్తాను మరి.

హేమ : ఏమండీ!

డాక్టరు : ఏమిటన్నారూ? ఏమిటండీ?

హేమ : కొంచెం ముందుగా కళ్ళు విప్పాలి. అవసరం.

డాక్టరు : కొంచెం ముందుగానా? నో నో - టైమ్ ఈజ్ వెరీ - పదింటికి ఇంకా కటు విప్ప కూడదు. మీ క్షేమంకోసం చెబుతున్నా. ఓ.కె. వస్తాను.

హేమ : ఏమండీ!

డాక్టరు : ఏమిటంటారో చెప్పండి. అటు సీరియస్ కేస్ వుంది. వెళ్ళాలి. ఏదో చెప్పబోయారు. చెప్పండి! మిమ్మల్నే!

హేమ : నాకళ్ళు..........

డాక్టరు : డెఫ్ నిట్లీ. తప్పకుండ బాగవుతాయి. పదింటికి. వస్తామరి యస్. ఓ. కె. బైబై. (వెళ్ళి పోయాడు.)

హేమ : ఏంటో వారికంత తొందర. మాట కూడా నిదానంగా మాట్లాడరేం?

వర : వారిమాటే అంతే. ఆలోచనమున్కొంది. అందుకే ఆ మాటల్లో ఆతొందర. ఆయన హస్తవాసి...

హేమ : అంత త్వరగా వెళ్ళిపోయాడేం?

వర : అక్కడేదో సీరియస్ కేసట. కాని మీరు ఫోను చేశారనే సరికి అన్ని విషయాలూ అలా వుంచి ఇక్కడికొచ్చారు.

గంగా : (వస్తూ) జనతా వచ్చిందమ్మా!

హేమ : అవునా నాన్నా!

గంగా : అవును. టైం అయింది. రమేష్ వస్తూవుండాలి.

హేమ : నాన్నా! కాస్త సంపాదుగా. డిగ్రీకు బావ కు తెలుటనా? మర్చిపోయావేమో. ఆ మాట అడిగావా?

(గోడ గడియారం తొమ్మిది గంటలు కొట్టటం మొదలు పెట్టింది. వరలమ్మ, హేమలతల సంభాషణలు జరుగుతున్నాయి.)

హేమ : (సంతోషంగా) ఏవమ్మా!

వర : అమ్మా!

హేమ : బావ...

వర : వస్తున్నాడు.

హేమ : నాకు...

నర : ఆనందంగా వుంది.

హేమ : అవును.

నర : అలాగేనమ్మా మరి.

(...గడియారం తొమ్మిదిగంటలు కొట్టటం నరసమ్మ హేమలమధ్య సంభాషణ ఆగిపోవటం జరిగింది. అంతలో కారు హారను...)

హేమ : బావ వచ్చాడు.

నర : అవును వస్తున్నారమ్మా!

హేమ : (పెద్దగ) బావా!

రమేష్ : (దూరంగ) హేమా!

నర : రమేష్ బాబుగారు ఇక్కడికే వస్తున్నారు. నువ్వు కూర్చోమ్మా! కూర్చో!

రమే : హేమా!

హేమ : బావా!

రమేష్ : ఏలాగైపోయావు హేమా.

హేమ : (నిర్లిప్తంగా) ఆఁ!—ఎన్నాళ్ళకొచ్చావు బావా!

రమే : మరి ఆ చెరికో......

హేమ : రెణ్నెలనుంచి ఉత్తరంకూడా వ్రాయలేదే!

రమే : మూణ్ణెల్లనుంచి థీసీస్ కాపీల హడావిడిలో వుంటంవల్ల తీరుబడిలేక పొరపాటుజరిగింది.

హేమ : పొరపాటేమిటిలే బావా!

రమే : బాగా చిక్కిపోయావు!

హేమ : నేనలా కనిపిస్తున్నానా? బావా! నిన్ను చూసే భాగ్యం లేకపోయింది. డాక్టరుగారు ఇవాళే కట్టువిప్పుతానన్నారు.

రమే : హేమా! అసలు నీ కళ్ళకేమయ్యాయి.

హేమ : (బాధగా) ఏంచెప్పేది బావ! నెలరోజుల క్రితం అదేదో జ్వరంవచ్చింది. నాలుగురోజులు తీవ్రంగావుంది. నాలుగోరోజు రాత్రినుంచి ప్రారంభం, కళ్ళు మసక మసగ్గా కనిపించాయి. నీ ఫోటోదగ్గరకుపోయిచూశా. బావా! ఫోటో కనిపించింది కాని గుర్తు తెలియలేదు.

రమే : (ఆశ్చర్యంగా) ఆఁ!

హేమ : చీకటి కారణమని నిద్రపోయాను. తెల్లవారి లేచాను. మసక మసగావుంది. రాత్రికంటే కొంచెమెక్కువ. సూర్యుడు బాగ చెల్లమయ్యగా వచ్చి, కళ్ళలో పడుతున్నాడు. కళ్ళవెంబడి నీరు కారడం మొదలుపెట్టింది. నాన్న ఇంటి వద్దలేరు బావా! నరసమ్మను కేకేసి చెప్పాను. ఆవిడ ప్రైవేట్గా కళ్ళుతిరుగుతున్నాయేమోనని నన్ను కుర్చీలో కూర్చోబెట్టి వెళ్ళింది. కళ్ళు మూసుకున్నాను కొంచెంసేపట్లో నాన్నగారొచ్చారు. నన్ను పిలిచారు. లేచాను. కళ్ళు తెరిచాను. నాన్నమాట విన్పించింది కాని, నాన్న కన్పించలేదు. ఏమిటమ్మా వెర్రిమాట అన్నారు నాన్న.

రమే : (ఆశ్చర్యంగా) వెర్రిమాటా?

హేమ : నేను భోరుమని ఏడ్చాను. (అప్పటికే హేమలత కంఠం వణికిపోయింది)

రమే : ఎంతపని జరిగింది!

హేమ : నెలరోజుల్నించి డాక్టరు శ్రమతీసుకుంటున్నారు. కళ్ళు వస్తాయని పదేపదే పలకటం కాని చెబుతున్నారు. ఇంకోగంటకల్లా వచ్చి, డాక్టరు కట్టువిప్పుతారు.

రమే : డాక్టరు జాగ్రత్తగా చూస్తున్నారా! (గంగాధరం బైటికి వెళిపోయాడు.)

హేమ : చూస్తున్నారు.

రమే : నరసమ్మ నిన్ను కంటికి రెప్పలాగా కాపాడుతోందికదూ!

హేమ : అవును బావ!

రమే : వీళ్ళిద్దరూ జాగ్రత్తగా చూడకపోతే ఇది చాలా ప్రమాదకరమైన కేసు. కళ్ళురాని ఇన్సిడెంట్సు కూడా వున్నాయి.

హేమ : (భయంగా) బావా!

రమే : భయపడకు హేమా! కళ్ళు బాగవుతాయని డాక్టరు చెప్పారన్నావుగా. విచారించకు ధైర్యంగావుండు. అప్పటి చురుకుదనం నీలో ఏమైంది హేమా! ఇంత నీరసంగా వున్నావ్!

హేమ : అదేమిటి?

రమే : ఆగ్రా మెయిల్ సెకెండుక్లాసులో ఒంటరిగా వున్నప్పుడు...

[ ఫేడ్ ]

*   •   *   *

(—రైలుకూత—రైలు పోతున్న సవ్వడి. క్రమంగా దూరమౌతుంది)

రమే : నాకు తలనొప్పిగా వుంది.

హేమ : కాఫీ యివ్వనా?

రమే : కళ్ళు తిరుగుతున్నాయి.

హేమ : ఏమిటిబావా! ఇంకెవరూ లేరిక్కడ! ఇప్పుడేం చేసేట్టు?

రమే : ఇలారా హేమా!

హేమ : ఎందుకుబావా! (లేచింది)

రమే : ఇక్కడ కూర్చో! ఆఁ.................. నాకే బాధావుండదు, హాయిగా వుంటుంది.

హేమ : ఏమిటిబావా!

రమే : అలా కూర్చో! లేవబోకు-

హేమ : ఇదా ఎత్తు?

రమే : కారణం మరి నీకళ్ళు.

హేమ : నాకళ్ళా!

రమే : అవును నీకళ్ళు

హేమ : ఏం?

రమే : (భయంగా) నాకు భయంగావుంది.

హేమ : ఎందుకూ? ఏమయింది? ఏమిటిబావా!

రమే : నీ కళ్ళు...

హేమ : నాకళ్ళ కేమిటి?

రమే : నాకు భయంగావుంది. నన్ను మింగేస్తున్నాయి. నేనిక్కడ కూర్చోలేను.

హేమ : ఏమిటి—పిచ్చిబావా! పాపం అక్కడ పడుకో బా!

రమే : హేమా!

హేమ : ఆఁ!

రమే : భగవంతుడు నీ కళ్ళంత అందంగా ఎందుకు తయారుచేశాడో (రైలుపోతున్న సవ్వడి—కూత వినిపించి ఆగిపోతుంది)

* * * *

[ఫేడౌట్]

హేమ : (విచారంగా) ఆ కళ్ళప్పుడు,......

రమే : హేమా! విచారం దేనికి? సంతోషంగా వుండు. ఎంత 'శ్రమపడి థీసిస్ సబ్మిట్' చేశాననుకున్నావ్. రాగానే నిన్ను చూచి ఆ శ్రమంతా మరిచి పోదామనుకున్నా! నువ్విలావుంటే ఎలా హేమా!

హేమ : థీసిస్ బాగా వ్రాశావుగా?

రమే : ఫరవాలేదు. త్వరలో నే డాక్టరేట్ వస్తుంది.

హేమ : ఇంతకాలంనుంచి నువ్వు లేవు. ఇక్కడ నాకు ఇన్నాళ్ళు నిస్పృహగానే గడిచాయి. నువ్వు వస్తావనుకునేవరికి ఇదొకటి.

రమే : విచారించకు హేమా! త్వరలోనే నయమవుతాయి.

హేమ : కాని బావా! అమెరికానుంచి రాగానే మన మేరేజి అన్నావు.

రమే : ఇప్పుడేం?

హేమ : ఏవాఁ!

రమే : అవు నిప్పుడేం?

హేమ : ఒకవేళ నాకు దృష్టి రాకపోతే నన్ను......

రమే : రాకేం చేస్తుంది. ఇవాళే కట్లు విప్పుతారటగా!

హేమ: ఒకవేళ రాకపోతే, నేను నీకు......

రమే: డాక్టరు దృష్టి వస్తుందని చెప్పారన్నావుగా.

హేమ: నిన్న మొన్నట్నించి మాత్రమే వస్తుంది. తప్పక వస్తుంది, అంటున్నాడు. కాని, అంతకు ముందు చెప్పలేం, ప్రయత్నిస్తానన్నాడు, అది తల్చుకుంటే గుండె ఆగినంత పనవుతోంది. అయినా నాకళ్ళొచ్చిందాకా నమ్మకం లేదు.

రమే: తప్పకుండా చూపు వస్తుంది. భయపడకు హేమా!

హేమ: ఒకవేళ రాకపోతే...నా జీవితం...

రమే : ఆలోచింపవలసిన విషయమే!

హేమ: (ఆశ్చర్యంగా) ఆఁ! ఏమిటి! (కోపంగా) బావా!

రమే: (మాటాడడు).

హేమ: ఏమిటిబావా నువ్వన్నది.

రమే: ఆఁ! ఏముంది! ఏమీ లేదు! ఊరికే నే అన్నాను.

హేమ: ఏమనీ! ఆలోచింపవలసినవిషయము నేగదూ!

రమే: పిచ్చిహేమా! నేను నిన్నుతప్ప మరొకర్ని పెళ్ళి చేసుకోగలనా?

హేమ: నిజమాఁ బావా!

రమే: అనుమానం కూడానా!—అది న్యాయం. సరి గానీ నేనిక్కడ ప్రొఫెసర్ని కలుసుకోవాలి. పది దాటింతరవాత దొరకడు. వారితో మాట్లాడితే రేపు డాక్టరేట్ రాగానే సెంట్రలు అపాయింటుమెంటు జరుగుతుంది. అది మన బాగుకే కద! పోయి మాట్లాడివస్తా!

హేమ: డాక్టరు వచ్చే వేళయింది. కట్లు విప్పింతరవాత పోకూడదూ!

రమే: ఫరవాలేదు హేమా! పదింటికి డాక్టరువచ్చి కట్లు విప్పుతారు. కళ్ళొస్తాయి. పదింటికి నేను ప్రొఫె

సగంతో మాట్లాడంకూడా అయిపోతుంది. వెంటనే వస్తాను. వస్తామరి.

హేమ: బావా! నువ్వు హృదయ పూర్వకంగా నాకు కళ్ళు రావాలని కోరుకున్నావా?

రమే: అదేంమాట హేమా!

హేమ: ఏముంది? నాకు కళ్ళు రావాలని కోరతావు గానీ రాకపోతే పెళ్ళి చేసుకోవుగదా.

రమే: ఏమిటది?

హేమ: ఏముంది నా సవాలికి నా స్వరూపం.

రమే: పోయిరావాలి. వస్తా మరి.

హేమ: సరే!

గంగ: (వస్తూ) ఎక్కడికి రమేష్.

రమే: ఇప్పుడేవస్తా మావయ్యా!

గంగ: డాక్టరువచ్చే వేళయింది. కట్లు విప్పేంతర వాత పోకూడదూ?

రమే: అప్పటికి వస్తా మావయ్యా! (స్వరం క్రమంగా దూరమౌతుంది).

గంగ: అమ్మా! రమేషూ—

హేమ: వస్తాడు! నాన్నా! నాకు కళ్ళొస్తాయా!

గంగ: తప్పకుండా—..........

హేమ: బావ నన్ను పెళ్ళి చేసుకుంటాడని నీకు నమ్మకం వుందా?

గంగ: అదేం మాటమ్మా! అపనమ్మకమా నీ బావ విషయంలో...

హేమ: కాదునాన్నా! అసలు జీవితమే ఓ పరీక్ష. అందులో మళ్ళీ...

గంగ: అవాంతర పరీక్ష లంటావా?

హేమ: అవసరమైతే అవి తప్పవు నాన్నా!

గంగ: ఏమిటమ్మా నువ్వనేది?

హేమ: ఏమీ లేదులే నాన్నా!

(—కారు హారను.—) డాక్టరొచ్చివుంటాడు నాన్నా!

గంగ: అవునమ్మా! డాక్టరే! (వెళుతూ) రమేషు కూడా...

హేమ: బావ రాడులే నాన్నా!

శర: (వచ్చి) డాక్టరొచ్చారమ్మా!

(గోడ గడియారం పదిగంటలు కొట్టింది.)

హేమ: (మొదటి మోత) నాన్నా! (రెండో మోత) శరదమ్మా! (మూడో మోత) డాక్టర్ (నాలుగో మోత) వచ్చారా. (ఐదో మోత) కట్లు. (ఆరో మోత) పోగుతాయి (ఏడో మోత) నాన్నా (ఎనిమిదో మోత) నాన్నా! (తొమ్మిదో మోత) బా...(పదో మోత). వ!

డాక్టర్: హల్లో!

[విరామం]

* * *

(గోడగడియారం మూడుగంటలు కొడుతుంది.)

గంగ: రమేష్ ఇంకా రాలేదే! ఎలా నిలబడ గలుగుతాడో!

శర: పెళ్ళిపని అవ్వాలి కదండీ!

హేమ: అవును కావద్దూ మరి. వస్తావుంటాడులే. జీవితాలు.........

[కారు హారను]

గంగ: రమేష్ వచ్చినట్టుంది!

రమే: (ప్రవేశిస్తూ దూరంగా) హేమా!

హేమ: (సమాధానం లేదు.)

రమే: మాటాడదేం హేమా? మావయ్యా! ఏమిటి మీ ముఖంలో అదోమాదిరిగా వుంది. లేనినవ్వు తెచ్చుకోడానికా? ఉన్ననవ్వు పోగొట్టుకోడానికా? ఏమిటీ ప్రయత్నం.

గంగ: (సమాధానం లేదు.)

రమే: శరదమ్మా! ఏమిటిదంతా?

శర: అమ్మాయినే అడుగుబాబు!

రమే: హేమ పలకటంలేదు—హేమా!

హేమ: (గద్గదస్వరంతో) ఏం బావా!

రమే: కళ్ళొచ్చాయా?

హేమ: (దుఃఖంతో) అంతభాగ్యమా?

రమే: రాలేదా?

హేమ: లేదు బావా!

రమే: కళ్ళు రాలేదా!

హేమ: (ధైర్యం తెచ్చుకొని, దుఃఖం ఆపుకుంటూ) విధినిర్ణయముండగా అనురూపం దేనికి బావా. విధి నన్ను చిన్నచూపు చూశాడు. ఇంతకూ నా అదృష్టం ఇలా వుంది.

గంగ: (దుఃఖం దిగమింగుకొని) చేవలా వెళ్లివస్తా నమ్మా!

రమే: అదృష్టం దురదృష్టం ఏమిటి? డాక్టరు సరిగా ట్రీట్ చేయలేదేమో.

వర : నే రేపొద్దటే వస్తానుబాబూ! (వరవమ్మ గంగాధరం వెళ్లిపోతారు.)

హేమ: అదేమిటి బావా!

రమే: ఏముంది హేమా! మీరిద్దరం ప్రేమించుకున్నారా?

హేమ: ఊఁ!

రమే: పెళ్ళి చేసుకుందామనుకున్నారా?

హేమ: అవును.

రమే: నిన్నటిదాకా నువ్వు పెళ్ళికి తగినదానివు. ఇవాళమాత్రం కాదు.

హేమ: ఆఁ (ఆశ్చర్యంగా)

రమే: అందుకే అదృష్టంమీద నాకు నమ్మకం లేదు.

హేమ: బావా ఏమిటా మాటలు? నన్ను పెళ్లి......

రమే: నీకు కళ్ళు లేవుగా!

హేమ: నీకున్నాయా? 'దుఃఖంలో' మన జీవితాల కిది పరీక్ష బావా. నా కళ్ళు మరో కట్టుతో రావచ్చునని డాక్టరు చెప్పాడు. ఈసారి కట్టుతో కళ్ళు తప్పక వస్తాయి. నన్ను కాదనకు బావా! కళ్ళు రాకపోవు బావా!

రమే: డాక్టర్లు ప్రయత్నం చేస్తే రాని నీ కళ్ళు ఇంకో కట్టుతో రాకపోవంటే తెలివైనవాడెవడు నమ్మడు. నీకు కళ్ళు రావు.

హేమ: బావా!

రమే: హేమా! నీకు కళ్లురావటం కష్టం

హేమ: బావా!

రమే: అంతే హేమా! బాధ ఎందుకెక్కువగా కల్పించుకుంటావు.

హేమ: నాకళ్లు అందంగా వుంటాయనీ......

రమే: నే నొప్పుకుంటాను. కాని కళ్లులేని నీ ముఖంలో ఏ కళా కాంతులు వుండవని నీకు తెలుసు.

హేమ: డాక్టరు కళ్ళు రావచ్చునన్నారు బావా!

రమే: డాక్టర్లు అలాగే అంటారు.

హేమ: మా నాన్న చాలా ధనవంతుడు.

రమే: కావచ్చు!

హేమ: బాగా పొలముంది.

రమే: లేదని ఎవరూ అనరు.

హేమ: మూడు మేడలున్నాయి. నేనొక్కదాన్నే వారి సంతానం. నీకు తెలుసుగా బావా!

రమే: మీ నాన్న తలుచుకుంటే రేపీపాటికి నీకు పాతిక పెళ్ళిళ్ళు చేయించగలడు.

హేమ: (కోపంతో) బావా!

రమే: అంతేకాదు. లక్షలుందని పోషింపగలరు. అయితే దాని వెనక భయంకరమైన స్వార్థం పేరు ప్రఖ్యాతులకోసం ఒళ్లు విరుచుకొంటోంది.

హేమ: నన్ను కూడా.........

రమే: (బాధగా) అవ్వునా హేమా! పోషించాడు. పెద్దవాణ్ణి చేశాడు. అమాట తప్పకుండా ఒప్పుకుంటాను. (కోపంగా) కాని నిలువెల్ల విషం కక్కుతూ, భాగాలు బుసకొడుతు వ్యాపించాడి ప్రతీక దాన్ని.

హేమ: ఏమిటి నువ్వు అనేది?

రమే: నువ్వు నన్ను ప్రేమించకపోతే, దిక్కులేని పక్షినైనాను ఒక గూడంటూ లేకపోయేది. అలాంటి మంచి ఆశ్రయం దొరికిందంటే కూతురికి నచ్చినవాడు అల్లుడు కాబోతున్నాడని, చెల్లెలు కొడుకుని చేరదీసి పెద్దచేశాడని లోకం అనుకుంటుందనే మీ నాన్న స్వార్థం. కారణం నీ అనుగ్రహం.

హేమ: కాదు మా నాన్న నిన్ను చెల్లెలు కొడుకువనే ప్రేమతో చేరదీశాడు.

రమే: అమాటే నేను ఒప్పుకోను. మా నాన్న పోయిన తరవాత ఒక్కగానొక్క సంతానమైన నన్ను చదువాపకుండా చేయాలనే పట్టుదలతో మా అమ్మ మీ నాన్న దగ్గరకు వచ్చి. డబ్బు అడిగితే, ఆయన అడిగిన మాటలూ, తిట్టిన తిట్లూ డబ్బు పంపుతూ నువ్వు వ్రాశావు గుర్తుందా? ఆ తరవాత...(గొంతుక గద్గద మౌతుంది) మా అమ్మ ఇంటికి కూడా తిరిగి రాలేదన్న సంగతి కూడా నీకు తెలుసుగా! (బాధతో) నాకు హృదయం లేదుగాని వుంటే ఏనాడో పగిలి పోవలసింది.

హేమ: నీకు హృదయం లేదన్న సంగతి వేరే చెప్పక్కర్లేదు.

రమే: హేమా!

హేమ: నీకు ఆశ్రయమిచ్చింది మా నాన్న!

రమే: మా కుటుంబం చితికిపోవటానికి కారణమూ అతనే!

హేమ: నేను నీకేమి అపకారం చేశాను బావా!

రమే: నువ్వే నాకేమీ అపకారమూ చేయలేదు. నేను నిన్ను ప్రేమించింది కూడా, మీ నాన్న ఆస్తిపాస్తులు చూచికాదు. ఆ తరవాత ఆ ఆస్తి ఉపయోగపడుతుందేమో అనే అవసరాల్లో వున్నాను కనుక కాదూ కూడదూ అనలేదు. నేను నీ అందాన్ని చూచి...

హేమ: మరి?

రమే: బాధపడుతున్నాను. నీకు అన్యాయం చెయ్యాలన్న భావం నాకెప్పటికీ లేదు. నిన్ను నేనెందు కారాధించానో అదివాడు నీలో లేదు. నిన్ను నేను కాదనటానికి కారణం నువ్వు గంగాధరం కూతురు అవటం కాదు.

హేమ: నిన్ను నేనే పరిస్థితులలోనూ వదిలిపెట్టనన్నావుగా బావా!

రమే: అవును హేమా! కానీ నేనీనాడు ఒక [illegible] లక్ష్యాన్ని కోల్పోతున్నాను. నా గౌరవ మర్యాదల విషయం ఆలోచించు. ఒక [illegible]. ఒక గుడ్డిదానితో కాపురం చేస్తూ పొందే గౌరవం ఏమిటి?

హేమ: బావా! నీకు నే సేవింపగా నా అహం లేకుండా వుంటానికి ప్రయత్నిస్తా. నీ పాదసేవ చేస్తా. ఆరాధిస్తా. పువ్వుల్లో పెట్టుకొని పూజించుకుంటా. నన్ను పెళ్ళి చేసుకో. మా నాన్న కారణంగా నన్ను బలిచేయకు.

రమే: హేమా! నీవు నన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నావా?

హేమ: ఏమిటి బావా? కొత్తగా...

రమే: అది కాదు హేమా! నీ హృదయ సౌందర్యాన్ని. పవిత్రతని, గాంభీర్యాన్ని అర్థం చేసుకోలేక కాదు. సమాధానం కావలసి...

హేమ: నీకు తెలుసుగా.

రమే: నేను క్షేమంగా, సంతోషంగా వుండటం నీ కిష్టమే కదూ?

హేమ: నేనింకెవరి క్షేమం కోరగలను?

రమే: అయితే దయతలచి మన పెళ్ళి ప్రస్తావన తేవొద్దు.

హేమ: బావా!

రమే: ఆ పిలుపుకింక అనర్హురాల్నైనా హేమా!

హేమ: బావా!

రమే: ఆ పేరుతో నన్ను పిలవకుండా వుండకూడదూ!

హేమ: (కోపంగా) మిస్టర్ రమేష్! తప్పకుండా అవస్థపడివి. ఇంక నిన్ను ఆ పేరుతో పిలవను.

రమే: హేమా!

హేమ: ఇంక అభిమానంగా పిలవకు మిస్టర్ రమేష్!

రమే: హేమా!

హేమ: డోంట్ టాక్. నాకు కళ్ళు లేవు!

రమే: హేమా!

హేమ: నోరు మూసుకో. నీకు హృదయం లేదు.

రమే: హేమా!

హేమ: మిస్టర్ రమేష్! నోరు మూసుకుంటే మంచిది.

రమే: మీ నాన్న డబ్బుచూచి కాకుండా నీ అందం చూచి నిన్ను ప్రేమించాను. మీ నాన్న చెత్త పనులు కారణంగా నిన్ను విడిచిపెట్టటంలేదు. నీ దృష్టి లోపం నన్ను కలవరపెడుతోంది. నిన్ను పెళ్ళి చేసుకోలేను.

హేమ: రమేష్! మిస్టర్ రమేష్!! రమేష్!!!

రమే: గుడ్డిదానితో నేను పొందే గౌరవ మేముంటుంది. ఎంతకాలం సుఖంగా జీవించగలను. ఆలోచించు హేమా! నేను సుఖంగా జీవించాలనీ, ఏదో ఉన్నతదశ పొందాలనీ ఏదో మధురానుభూతి పొందాలనీ అనుకోవటంలో తప్పేముంది. ఆలోచించు. నేను నిన్ను ప్రేమించిన దానను కోకుండా డాక్టరేటున్న పొజిషన్ ఊహించు. ఒక గుడ్డిపిల్లను పెళ్ళి చేసుకోవచ్చునేనా? ఆలోచించు!

హేమ: నీకు తెలియని ఏదో బ్రహ్మాండాన్ని బద్దలు చేస్తూ హాయిగా కూర్చో.

రమే: నన్నర్థం చేసుకోవటం లేదు.

హేమ: లేదు. అర్థం చేసుకున్నాను. నేను పెళ్ళి కాక, పెళ్ళి చేసుకునే మగాడు లేక, కళ్ళు లేక, కళ్ళు లేని లోకంలో అంధులలో నీలాంటి వాళ్ళమధ్య జీవితమంతా, చచ్చేదాకా మసలిదాన్నయే దాకా అవకాశాల పాలవుతూ నాశనమై పోతాను.

రమే: నా ఉద్దేశం అదికాదు.

హేమ: మరేమిటి?

రమే: నీకు కళ్ళు లేకపోవటం.........

హేమ: నువ్వు ప్రేమించింది నన్నా? నా కళ్ళనా?

రమే: నిన్నే కానీ............

హేమ: కళ్ళుండి హృదయం లేని స్త్రీ కావాలా? కళ్ళు లేకపోయినా హృదయమున్న నేను కావాలా?

రమే: నా గౌరవ మర్యాదల విషయం ఆలోచించటం లేదు నువ్వు!

హేమ: నా జీవితాన్ని గురించి నువ్వుమాత్రం ఆలోచిస్తున్నావా?

రమే: ఏమాలోచించను?

హేమ: కళ్ళు లేనంతమాత్రాన నా జీవితం నాశనం కావలసిందేనా?

రమే: కళ్ళులేని నిన్ను కట్టుకొని నా గౌరవ మర్యాదల్ని నాశనం చేసుకోవాల్సిందేనా?

హేమ: నీ గౌరవంకోసం నా జీవితం నాశనం కావాలంటావ్?

రమే: నీ జీవితంకోసం నా గౌరవం నాశనం కావాలని నువ్వంటున్నావ్?

హేమ: గౌరవం, జీవితం ఒకటేనంటావ్! రమేష్! నీవంటి మహామేధావి డాక్టరేట్‌తో ఫారిన్ రిటర్న్ ఓ అంధురాల్ని పెళ్ళాడితే అబ్బ! ఎంత త్యాగపురుషుడో అని లోకం ఎంత గౌరవిస్తుందో గమనించు. నన్ను పెళ్ళాడటంవల్ల నీ గౌరవం ఎక్కువవుతుందే గాని ఎంతమాత్రం తగ్గదు. అలా నువ్వు పెళ్ళాడకపోతే, గుడ్డితనం కారణంగా కాక ప్రేమ కారణంగా నా జీవితం నాశనమవుతుంది. నిజంగా నేను నిండుకన్నులతో వున్నా నన్ను నువ్వు పెళ్ళాడేవా, కారణం నా కళ్ళా నా అందచందాలా కావు. మన ప్రేమ. అది మరచిపోకు రమేష్.

రమే: మన ప్రేమ నిజమే హేమా! ఇప్పటికీ మనస్ఫూర్తిగా నీమీద నాకు ప్రేమవుంది. కాని ఒక అంధురాల్ని భార్యగా స్వీకరించి ఆ జన్మాంతం అవస్థపడలేను.

హేమ: అంతేనా రమేష్?

రమే: అంతే హేమా!

హేమ: అంతే కదూ?

రమే: అంతే!

హేమ: సరే! రమేష్! నిజంగా నీకు నామీద ప్రేమ లేదు. నా కళ్ళా అందచందాలా కంటె నా డబ్బు మీద నీ దృష్టి నీ చదువుకీ, నీ గొప్పకీని. మన సిద్ధాపన్నదే నా దృష్టి. అయితేం నా డబ్బుతో నీ అవసరం తీరిపోయింది. ఫారిన్ ప్రిస్టేజి ఓ కుంటిసాకుగా తప్పించుకోవాలని ప్రయత్నిస్తున్నావ్.

రమే: నీ డబ్బుకోసం నిన్ను ప్రేమించానంటావు. పైగా నా స్థితిని ఫారిన్ ప్రిస్టేజి అంటున్నావ్. ఇంకా ఏమైనా అనగలవు. ఏమన్నా నేను అంధురాలి భర్తను కావటం అసంభవం.

హేమ: అంధురాలి భర్త! రమేష్! బాహ్యదృష్టి లేని అంధురాలా? అంతర దృష్టి లేని అంధురాలా!

రమే: అంతర దృష్టేఁటి అర్థం లేనిమాట.

హేమ: అంటే నీకు అవసరమైన అంతర్‌దృష్టి లేదన్నమాట నిజంగా నువ్వే గుడ్డివాడివి. అంతరాత్మ లేని అంధుడివి. మూర్ఖుడివి.

రమే: (తీక్షణంగా) హేమా!

హేమ: రమేష్: నీకు అంతరదృష్టేవుంటే ఆ పేరుతో పిలవ్వు. నువ్వు మూర్ఖుడివే కాదు. బుద్ధిలేనివాడివి.

రమే: ఆపై వాగకు హేమా!

హేమ: అవును వాగటమే అనిపిస్తుంది బుద్ధివుంటేగా! సెల్ఫిష్‌ఫూల్! అన్‌గ్రేట్‌ఫుల్ రెచ్!

రమే: షటప్! (చెంప పెట్టు)

హేమ: అబ్బా!

వర: బాబూ! (అంటూ వస్తుంది)

గంగా: చెయ్యికూడా చేసుకున్నావా రమేష్! (వచ్చాడు).

హేమ: చెయ్యేమిటి మరేమైనా చేసుకుంటావు. కళ్ళుండి కనిపించనివాడు. మిస్టర్ రమేష్ నీకు కావలసిన బాహ్యదృష్టి నాకు సరీగ్గా వుంది. తెలుసా!

రమే: ఆఁ!

హేమ: మిస్టర్ రమేష్! నిజంగా నాకు కళ్ళు వచ్చాయి.

రమే: ఆఁ!

హేమ: కళ్ళులేక చూడలేనిదానిని కాదు. కళ్ళుండి...

నర : అవును బాబూ! కళ్లు విప్పగానే ఉదయంకళ్లొచ్చాయి.

గంగా : డాక్టరుగారు మంచి ట్రీట్‌మెంటు చేశారు. ఆయనకెంతైన ఋణపడివున్నాను. అమ్మాయి నీతో అబద్ధమాడింది. నిన్ను ఆనందింపచేసుకోటానికి పిచ్చితల్లి ప్రయత్నం. వద్దన్నా వింది కాదు.

రమే : నిజంగానా?

హేమ : అబద్ధం పలికే?

నర : నిజం బాబు!

గంగా : హేమకు దృష్టి వచ్చింది రమేష్.

హేమ : రమేష్‌కి దృష్టిరాలేదు నాన్నా! మామూలు కళ్ళు మాత్రం వున్నాయి. మనుష్యుల హృదయాలు చూచే కళ్ళులేవు. ఏం రమేష్! నాకు మామూలు కళ్ళు వచ్చాయంటే నువ్వు నమ్మలేక పోతున్నావ్?

రమే : నమ్మలేకుండా వున్నా!

హేమ : నువ్వు నమ్మలేవు. నమ్మే అర్హత నీకు లేదు. నమ్మినా ప్రయోజనం అంతకంటే లేదు. రమేష్! నీకొక్కవలసింది బాహ్యదృష్టి కూడా కాను. బాహ్యాడంబరం. ఇప్పుడు నువ్వు ఇదివరకటికంటే వేషభాషల్లో ముందడుగు వేశావ్. అది నీ ఫారిన్‌టూరికి ఫలితం.

రమే : ఇవంతా ఏవిటి?

హేమ : ఏంవుంది? నీకళ్ళకు కృత్రిమమైన కళ్ళజోడు చేరింది.

రమే : హేమా!

హేమ : అనేకసార్లు చెప్పాను అలా పిలవద్దని. ఆఖరిసారిగా మరోసారి చెబుతున్నా. బుద్ధివుంటే నన్నింకలా పిలవకు.

రమే : హేమా!

హేమ : కళ్ళొచ్చాయి కనా పెళ్ళిచేసుకుందామనా —రాబోడవేం?

గంగా : అమ్మాయ్!

హేమ : నాన్నా! ఇది నా స్వంతవిషయం. నీకు పిల్లడిమీద మమకారం వున్నా, రాతిహృదయం గల రమేష్‌మీద నాకు ఎంతమాత్రం అభిమానం లేదు. ఉండదు.

నర : అమ్మా!

హేమ : రమేష్! నీగౌరవానికి లోపంరాని వివాహమే చేసుకో, ఇకవెళ్ళు.

రమే : హేమా!

హేమ : డోంటాక్!

గంగా } (ఒకసారి) { అమ్మాయ్!
నర } { అమ్మా!

హేమ : ఇది నా స్థిరనిశ్చయం. గుడ్డిదాన్ని పెళ్ళాడితే గౌరవానికి లోపంవచ్చే గజిటెడ్ ఆఫీసరుగారికి నేను తగనిదాన్ని. గుడ్డిదాన్నట! ఎవరుగుడ్డో! ఎవరికి సరైన దృష్టి లేదో!

రమే : క్షమించు హేమా!

హేమ : అనవసరం. నాకు దృష్టిపోయింది. మళ్ళీ వచ్చింది. అసలు నీకు దృష్టి అన్నదే లేదు. అమాయకంగా బాల అని ప్రేమించిన నాలో స్వార్థం వుందన్నావ్! ఆ స్వార్థం నీలో కరుడు గట్టింది. నిజానికి నీకు దృష్టిలేదు. ఏ దృష్టి నాకు లేదని గాఢంగా అనుకున్నావో ఆ దృష్టేకాని, అంతకంటె ఉన్నతమైన అంతర దృష్టి, మానవుడికి అత్యవసరమైన అంతరదృష్టి అసలు నీకు లేదు. అలాంటి నిన్ను క్షమించటం అనవసరం.

రమే : హేమా!

హేమ : మిస్టర్ రమేష్!

రమే : ప్లీజ్!

హేమ : గెటౌట్!

రమే : (దగ్గరగా) హే.... (దూరంగా) మా....

అలిండియా రేడియో హైదరాబాదు, విజయవాడల సౌజన్యంతో

# కౌముదీ విహారము

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

కవితా సుందరి రమ్ము చేగలిపి ప్రక్కన్ నిల్చి నాయందమం
దివతాళించు భవద్భుజమ్ము నిడి రమ్మా కౌముదీ వేళ, నీ
పువ్వుటంగమ్ములు సోక క్రొంబులకరింపుల్ పూవ నమ్మేన త్రి
దివ మాధుర్యము చూరలాడి భువి కందిత్తున్ సుధాగీతముల్.

రావే బర్హిశిఖాచకచ్చకిత నేత్రా! సాంధ్యమల్లీ స్ఫుర
ల్లావణ్యైక నిధాన మంజహాసితా! లక్షింతు నీ కోసమై
ఈ వైశాఖ సితాభ్ర ఖండ రథమం దేతెంచి గోదావరీ
శైవాలి న్యుపకంఠ కుంజములపజ్జన్ సుంత కాలూనుమా!

వేయి సువర్ణకాంత లొకపెట్టున నవ్విన హాస రాసి తే
మో, యమరాసురోన్మథిత మోహన ఫేనిల దుగ్ధసింధు వే
మో, యనిపించు నేటిదరి పున్నమి వెన్నెల క్రొత్త పొంగులో
హో! యిటుచూడు! కోటి మధురోహలు గొంతులు విప్పజూచెడున్.

నీకడకంటి తళ్కు దయనిల్వని నాయొక దీనవీణ, నీ
రాకలు లేని రాక యపురా! నునురేకలు లేని పూవు, ఇం
తేకద! ఏది సుంత విదళింపుము నీ కరకంకణ ధ్వనుల్
శోకము శ్లోకమై పొరలు సూనృత మంగళగీత మాధురిన్.

నీరవ దూరదూరముల నిండిన వెన్నెల స్వీయ రమ్యతా
భారము మోయలేక విదుపన్ పిడికిళ్ల కొలంది శుభ్ర శో
భారమణీయతల్ చెదరిపడ్డవి చల్లని మల్లెలౌచు నీ
తీరములందు, తీవి నరుదేరుము పూవుల త్రోవలో సఖీ!

అవనియె ఒక్క తెల్లగలువై యిట దేలెను చూడు చంద్రికా
ప్రవిమల పంకజాకర పరమ్మున, తుమ్మెద జంటవోలె నీ
పువు బారలన్ విహారములు పోదము, జుమ్మని కంఠమెత్తి భూ
ర్భువములు మారుమ్రోగ సరి క్రొత్తవి గీతము లాలపింతమే!

ఒకడ ధరింపలేను గద యుగ్మలి! ఈ నవచంద్ర చంద్రికా
ప్రకటిత విశ్వరూప బహుభారమనోజ్ఞత, రమ్ము సుంతి చెం
తకు కలహంసివోలె సికతాస్థలిపై నడ లందగింప; నా
వకు దెరచాప లెత్తుదము గౌతమి యూయల లూప పొంగుచున్.

*　　*　　*　　*　　*

[1]* ఈ పల్లె యగ్రహారము
మాపట నిద్రించు నిట నమాయికముగ మా
జ్ఞాపకముల వెల్గించుచు
లోపల నేదేదొ స్వప్నలోకము విరియున్.

ఓహో! జ్ఞప్తికి వచ్చె నీమహి చళుక్యోర్వీశు నౌదార్య సు
శ్రీ హృద్యంబయి బారసాచినది; ధాత్రీ దేవతా పుణ్య రే
ఖా హాస్యుండగు చీదమార్యుని యమోఘాశీస్సు లాంధ్రేశు శ్రీ
వా హీరాంచిత హారశోభలయి వహ్వా! వెల్గుచే నేటికిన్.

వెన్నెల వెండిమెట్ల సరవింగొని మెల్లగ డిగ్గివచ్చు న
ర్యోన్నత రూపశాలి యెవరో!—అవునౌను చళుక్య మన్మథుం
డిన్నటివారు నన్నయకవీంద్రులు! [2]నందమపూడి భాగ్య సం
పన్నుని కేలు కేలగొని వచ్చె నవాంధ్రము జూచువేడుకన్.

తొలి తెల్గుబాల ముద్దుల మాట గావించి జాణ గీర్వాణితో జతలు కలిపి
వేంగి భూవిభు యశోవిమల కర్పూరముల్ రాకానిశలయందు రంగరించి
వేదచోదిత మహా విపులార్థములు తెన్గు పల్కుపొందికలోన పదునుపరచి
నారాయణుని తోడునన్ తెల్గు గాండీవ మెత్తి పూజల్లుల నెగురజిమ్మి
వ్యాస గంభీరముద్ర, పంపన్న హొయలు కరుగబోసి త్రైలింగ్య క్ష్మ మెఱుగులిడిన
ఆంధ్ర కవితాదిమార్గ మహాపథికుడు అదుగో! మరల గౌతమీతీరమందు దోచె.

గౌతమి యొడ్డులన్ ముదురగాచిన వెన్నెలపాలపొంగులన్
ప్రీతి విదల్పలేక తెలికేల విహారము సల్ప వచ్చిరే
మో, తెలుగుం బాలమ్ములకు భూవిభుడుం గవిమిత్ర యుగ్మమున్—
మాగృహ ధాత్రిపై మనుచు మాయని తీయనగాదె! యేరికిన్.

1. కొరుమిల్లి యగ్రహారము చంద్రగ్రహణ సమయమున చీదమార్యునిచే బ్రాహ్మణులకు దానమీయబడినది.
2. నారాయణభట్టు.

